# స్నేహలత.

ఇది.

మే. వేంకటాద్రి అప్పారావు బహద్దరు

గారిచే రచియి



తె: ఖ

సౌదామినీముద్రాక్షరశాల.

# పీఠిక.

ఆంధ్ర మహా జనులారా!

ఇందు వ్రాయఁబడిన విషయములన్నియుఁ బయిపూఁతగాఁ జెప్పినవేయైనను పశ్చాత్తాపంబునొందిన చో, నొకపాఱి కంటె నెక్కుడుగఁ బఠియింపఁబడని యవి, యందుచే, నీసంగ్రహ పర్యవసానమగు, కన్యావరశుల్క నిరసనము జనుల మనంబుల కవసరమని తోఁచుననియు, నాసకొంతయు, స్నేహలతాదేవి యొనర్చిన దేహత్యాగము వ్యాదియును నెలకొల్పిన కరుణ, విచారము. ఆశ్చర్యము కోపము మొదలగు వైకల్యములన్నియు నుప్పిరిగొని కొంతయుఁ బ్రోత్సాహ పరుపనే దీనిని వ్రాసితిని.

ఇటీవల కొందరు బంగాళీబాలికలు తగినకారణము లేకున్నను "పులినిఁజూచి నక్క వాతపెట్టుకొనినట్లు" తామును కూడ స్నేహలతా దేవిననుసరించి, యామె తనదేహముచేఁ బ్రజ్వలింపఁజేసిన యగ్ని ప్రకాశమును, యానవసరముగఁ దమశరీరములందు బడవేసి, నిందకగ్గించి ఆమెచేసిన గొప్ప

త్యాగమునకు (Self-burning mania) తమ్ముఁ గాల్పఁ గోరెనను పిచ్చి, అను పేరు పెట్టించిరి. కాని యీ యుగ్రమునకే స్నేహలతాదేవియందు మనకుఁ గల గౌరవము తగ్గఁ గూడదనియు, శుల్క-నిరసన కార్యంబునందు నిరాదరణయు నిరు మాంద్యమును కలుగఁ గూడదని నా ప్రార్థన.

కే. వి. అప్పారావు

# ERRATA

| పుట | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 10 | నెలకొను | నెలకొన |
| 7 | 2 | నర | నల |
| 10 | 2 | తనకట్టి | తనకట్లు |
| 16 | 13 | మహోయింత | మహితేంత |

# స్నేహలత.



## ద్విపద.

కలహావు వర్ణింపఁ ◆ గాలేనుగాని
విలసిల్లు నలినీల ◆ వేణీభరంబు
పేరిమసారపుఁ గనుల్ ◆ బింబఫలంపు
రామణీయకమున ◆ రంజిల్లుమోవి,
గలిగిన నెమ్మోము ◆ కరముల సౌరు
చెలువైన తనుకాంతి ◆ చిన్ని నెన్నడుము,
మృదుపదంబులు నింక ◆ మెలఁతల శోభ
కొదవు హాసవిలాస ◆ మొప్పారియుండి
చెలువుల వశ్యులఁ ◆ జేయఁగా మిసులు

తలుదార్లనుపయోగ ♦ పఱచునవెల్ల
నూహించి నేఁజెప్ప ♦ నురుదార్ఢ్యనిధికి,
స్నేహాలతకుఁ బిత్రు ♦ సేవానుమతికిఁ
దప్పక కలవందుఁ ♦ దలఁచెదనైన,
నొప్పెడిసౌందర్య ♦ మువిద తానింత
యువజన విజయోప ♦ యోగంబునందుఁ
బరివశంబుగానీక ♦ పరదైవమానుఁ
దనతండ్రినెంతయు ♦ దయతోడఁగొలిచె
వనిత మాతని సేమ ♦ మారయుచుండె.
చెలువుని చిత్తంబుఁ ♦ జెదరంగఁ జేసి
వలపు చిక్కులలోన ♦ వడిఁద్రోయఁజాలు
తరుణిపెన్నెఱివేణి ♦ దండిగూఁదిదిని
గరమున సరిచేయఁ ♦ గడునమ్రమయ్యో
గాంతుచుంబనములఁ ♦ గరమొప్పఁజాలు
దంతిఘాలముతండ్రి ♦ యెవ్వడుదుఃఖ మును

కారుచీఁకటికిని ♦ గలువతేఁడయ్యె.
వోరచూపుల నెంత ♦ యుద్రిక్తునైనఁ
దనకు వంపఁగఁజాలు ♦ తరుణికన్దోయి
జనకునకనురాగ ♦ సాగరంబయ్యెఁ
బ్రియుఁడల్లఁ బూనంగఁ ♦ బెంపాఱఁజాలు
చెయిదోయి తండ్రికిఁ ♦ జేయూఁతలయ్యె.
వేయేల చెప్పంగ ♦ విష్ణువు సురలు
రాయలు కవులు ధ ♦ రను సర్వజనులు
కలముల మాటలఁ ♦ గార్యంబులందుఁ
బలుభంగుల ననుగోరి ♦ పైఁబెట్టుకొనెడు
కామినీశృంగార ♦ కాయంబు నబల
రామమై యాశ్లేష ♦ రసికత్వమొనరన
బ్రియభుజాంతరమునఁ ♦ బెంపొందఁ జనక
నయముగాఁ దండ్రి ♦ నానందింపఁగోరి
యనయంబు జననిరో ♦ గాక్రాంతయగుటఁ

దనగృహకార్యము • ల్బాగఁ జేయుచుండె;
పితరు నిట్టులఁ గొల్చి • ప్రీతిమై స్నేహ
లతనేత్రి పర్వకు • లాలింపనతఁడు
సుకుమారముగ ముద్దు • సుతఁ బెంచుచుండి
ప్రకటంబుగా నట్టి • పడఁతిగుణములఁ
గాంచి సంతోషించి • గర్వించి తలఁచె
"మంచి భాగ్యముగాదె! • మహి నిట్టి సుతలు
పుట్టుట హరికృపా • స్ఫూర్తిఁ జూడంగ
నిట్టి కూఁతురె యూన • దెంతటి పుణ్య
సతిగఁ గావున దీని • సౌఖ్యంబు నేలఁ
బతిఁ గొప్పవానిని • బడసెద" ననుచు
నాతఁడంతట యేఁగి • యారసి తా సదు
కూఁతు సకను పెండ్లి • కొడుకు నెంచునను
గానక యక్కటా! • కలకత్త లోని
యూనివర్సిటి యను • సుమలిర విపణి

లోనార్క్యధీమంతు ♦ లోకంబునటులఁ
దానునుగొనెంచె ♦ ఘనమెంతో యొసఁగి;
మారిజనములార! ♦ సుజ్ఞానతత్త్వ
పారగులార! యో ♦ పండితులారా!
మనుజనమాత్రుయిట్టి ♦ మన కాలమందుఁ
గనియెఱుంగము రాజ ♦ కఠిన శాసనము
తప్పక యావని ♦ దండించుననుచు
మెప్పరో! నామాట ♦ నొక్కింత వినుఁడు
తెలియ రేమాఁ హిందు ♦ దేశంబునందుఁ
బాలవాధసనమ్ము పైఁ ♦ బ్రబలేచ్ఛఁ బెంచి
ధర్మత్రస్తసఁదూలి ♦ దయఁ బాఱఁదోలి ♦
కూరిమ్రభావమ్ముమాలి ♦ సంగాము లేలి
సుకుమారదేహాల ♦ సొబగుమాటలను
ముకురకపోలల ♦ ముద్దుకాంతులను
బెండిలిమిష బలి ♦ పెట్టుదురేరి

దుండగీనికి నైన ♦ జరితమా నడక
కొండతింతటికంటెఁ ♦ గ్రూరంపుకీడి
ముందెన్నొ రూప్యముల్ ♦ ముడుపుఁగట్టుమని
గన్యకుమెడఁబుస్తె ♦ గట్టుటకొప్ప
రన్యాయమోచిరే! ♦ యూరసిమూడ
మెడపుస్తెకాదది ♦ మేదినిజనులు
కడుపుకూనలనెల్ల ♦ గఱటిపేరాన
ధనమిచ్చువానికి ♦ దయలేకయమ్మ
వనువుచో మెడఁగట్టు ♦ వలుపౌనుగాని
నిర్మలంబగు ప్రేమ ♦ నెంకొనుదాని
ధర్మపర్యవసాన ♦ తాత్త్వికంబగుచు
వరిపవిత్రంబును ♦ సపద్యకంబగుచు
చతురాశ్రమశ్రేణి ♦ సాధనంబగుచు
విరతసౌఖ్య విశేష ♦ నిధిమార్గమగుచు
పరమార్థసాధక ♦ పావనంబగుచు

•బోటనీశనికిత్తుం•పూనియొక్కైన,
వనిరొుందివారిక్లో•నాచారకీతి
మనువుసేయఁగఁగోరు•మర్యాదనడుప
పాత్తు గొప్పగవారు•శుల్కాంబుగోరి
ర త్తితినతడువా•రడిగిన సొమ్ము
తినకామీఁజేసదాట•తలపోసిమిగుల
పనువుగావరుని తం•డ్రాత్మ బంధువుః
గోరశుల్కధనంబు•కొంచెమ్ము చేయ
వారుపట్టినపట్టు•వదలకయుండి
ధనము లేదనియింతె•దయచూపకుండి
జనకుండుతమకోర్కె•సమకూర్పనున్న
•పుత్రిని గైకొనరాహూ,•పోపొమ్మటనిరి
చితిగ్రమాపెండ్లిళ్ళు•సేయుదురిలను
నై నవో జనులారా!•యిట్లు వారన్న
దానికె వారలఁ•దగదనెఁకోపింప

వారలొక్క రేతుల్క • వాంఛను మనరు
భారతభూమిని • పలుచోట్లనింక
కులటయాగాక బల్ • కుటిలయాగాక
తలఁగోత్రియగు గాక • దయ్యమాగాక
ధనము తెచ్చెడి బాలఁ • దవిలికోనుదురు
ధనము లేమిని దవ్వు • తరుమఁజూచెదరు
ఈ పాపమవని పై • నెల్లనగుటఁ
గోపాదియొక్కరి • కొన్నినింకఁబోకు
దూరివారికి నేర • నొక్కంచునను వ
దూఱియాతనిపిచ్చి, • తులువ, యటఁగ్రుమ
భూమిమరాచార • భగ్నంబులే టుల
నేమి కారణమున • నేలునోగాని
స్వేచ్ఛ కౌనిప్పు • చేవీఁ పనుల
నిచ్ఛింపవలెక • మొగార మ్యోనరయ
కావున జనులారా! • నూఁ మతిమీరు

భావించివీనిమా♦న్పఁగఁజేయలేరు
తనకిట్టిపితరుండు♦తగుభర్తఁదేఁగ
ఘనయత్నములఁజేయఁ♦గాంచియు స్నేహ
[illegible]తమెచ్చి మెచ్చని♦లాస్యంపుతెఱఁగు
చతురతఁజూపక♦దనకుసియందు
నెప్పుడుఁగలకూర్మి♦హెచ్చుగాఁదనకుఁ
జెప్పిచెప్పకడబ్బుఁ♦జేర్పంగవలదు
కష్టమందుటతన♦కతమూచు నెఱఁగి
యిష్టమింతయులేక♦హితమాతోఁవరని
తగుకీర్తివారింపఁ♦దలఁచియుసిగ్గు
వగముచంపఁగఁజెప్ప♦సాహసింపకయు
లోలోనవెతఁజెంది♦లోలోనఁగుంది
చాలగామదినెంచి♦చాలతపించి
యుసుమఃఖమువనుాడ♦సౌఖ్యనాడలఁదు
వఱతెంచియతిదీన♦భంగిగేహమున

కబలముద్దులకూతు • గరుదేర నెదుర
చుబుకంబుఁ బుడుకుచు • సుధలొల్కు దాని
ముద్దుమాటలఁ గోలి • మోమెంతయులర
తద్దయునటుగొంత • తడవుండి చెంత
వనిఁ జెప్పిలోనికిఁ • బాపి, ధ్యానంబు
జనఁజేసికొనిమున్న • జగతి యట్టులను
చెతలెల్లఁదనమది • వేవేఁగఁగ్రమ్మ
"క్షితినాఁడు వారలు • చింతింపనెంత
వనఁట తెత్తురుమగ • వారి పాలిఁటికి
తనయకల్గగనద్ది • ధవుఁ జేరువఱకు
బాలబుద్ధినిఁగాదు • బ్రతువదియొకటి
బాలయువతి కాఁగ • పతినొప్ప వాని
గొప్పచేరములిచ్చి • కొనివచ్చుటొకటి
యొప్పినపతిదక్క • నొకవేళ వార
లిష్టవర్తనమాని • హీనజీవితము

మరుసౌఖ్య మొనగూడ ♦ నున్నప్పుడేను
కొదువ సేతు నె సబ్బ ♦ కొఱకాన విడక
ధనము చాలమిగిల్లు ♦ తగనమిత్రమైన
దనయ పెండిలి చేసి ♦ ధన్యతఁగాంతు"
అని దుఃఖముసబల్కె ♦ నాతండు చెంత
విన సేమ చేసెను ♦ ః భ్రాంతిచేతఁ
ని గాబాలిక వెన్క ♦ గా వచ్చితన్ను
వీనులొగ్గియదంత ♦ పిన్న దెలుఁగడు!
అంతటనతఁడు తా ♦ నను కొన్న యట్టు
లెంతయు వెనుదీక ♦ యింటి నిగుదువ
పెట్టి, కాలేజిలోఁ ♦ బెద్ద పేరున్న
దిట్టనుఁగూఁతు కై ♦ తేనిశ్చయించె
తండ్రి మాటలవిని ♦ తలఁకి మాబాల
తీవ్రమౌ దుఃఖంపు ♦ దీసలతనంది
తను దూఱుకొని శుల్క ♦ ధర్మంబుఁ దెగడి

మనమందు శోషిల్లి◆మతి చింత చేసి
నిక్క-మాపితరుపుం◆నిక్క-నిమాన్పఁ జేయఁ
బెక్కు-భంగుల నెంచి◆పిన్నతనమున
వలదన లేక తా◆వగచియునింటి
నిలుపుమార్గంబు లెం◆న్నియు నెంచు మంద
జనకుండు నిల్లమ్ము◆న మకట్టి పట్టి
దినము చేరఁగ వచ్చె◆దీనత నింటి
వారలందరు దుఃఖ◆వశులై మెలఁగిరి
కోరి తెచ్చిన మన్వ◆కోరకైన శుల్క-
భారమోర్వఁగ లేని◆పాటులిట్లుండు
కానియింతకుమూల◆కారణంబైన
తా నేల స్నేహాల◆తా దేవియిపుడు
శాంతంబునగు మోము◆సాధింపవింత
వంత లేక యపూర్వ◆వైఖరినుండ
మనుషుండు వచ్చుచోఁ◆బుట్టింటివారు

వర! యెట్లయిననంచు ◆ చాన యెంచునొక్కొ
మగఁడువచ్చెడునన్న ◆ మగువకునిష్ట
మగుఁగాక, కానియీ ◆ యబలనుబోలు
పితరు మేలెంచని ◆ పిల్లనెందైన
నతివలలోఁ జూడ ◆ మోనువారినెల్ల
స్నేహాలతాదేవి ◆ చెవులారవినియు
నూహించియొగినూర ◆ కుండినదేమొ
ఇట్లుతాకట్టున ◆ కిచ్చెడిదినము
తెల్లవాఱఁగనంచుఁ ◆ దెలిసియెల్లరును
మనములబెగడొంది ◆ మఱితిండిఁదినక
చనిరిశయ్యాలకంటి ◆ జడివానఁదడుప
వంతనెల్లరువోవ ◆ నాస్నేహాలత మఱి
యింతనవ్వోలయుంగ ◆ నెవ్వరులేమి
గాంచియొంటరిగఁదా ◆ గదిలోనికేగ
చంచలలోచన ◆ స్వాతంత్ర్యములుక

వద్దముకడ కేగి • యలిసిలవేణి
ముద్దులొల్కఁగ విప్పి • మురువుగా దువ్వి
మోమందముగ దిద్ది • మోహనాకార
రామమైమేల్ బట్టె • రాజిల్లఁగట్టి
తగుభూషలను దాల్చి • తనరూపుఁగాంచి
వగకొంత సేపుండి • వపుఃప్రభావమున
నొక లేఖ నేమేమొ • నెమొగి లిఖియించి
ప్రకట స్థలినిదాని • బాగుగానుంచి
నేరినొక దుఁగొల్చి • మేమే నెనుసివి
దూరసితనవార • లతినిద్రియుంటు
తెలిసిమొగంబుపై • స్థిరభావమూని
చలియింపనట్టిహా • స్యముతో ననేమొ
గైకొనిపైమేడ • గనపున్కనెక్కె
నేకతంబిటులింతి • యేల జేసెనొకొ?
మగడువచ్చెడునన్న • మదసంపసించి

మగువకా శృంగార♦మహిమానుసరణి
కమనీయనిజరూప♦గర్వసంపదను
తమమీఁద పైనెక్క♦తగువిరహమునఁ
జల్లగాలిని, మారు,♦చంద్రునిదిట్టి
యుల్లాసముగనుండు♦నుద్దేశమేమొ:
అరసిచూడంగ♦నదికాదుకాదు
ధారిణినెల్లర♦దైవంబుకృపను
దనియింపసృజియించి♦దయచేసినట్టి
ఘనశక్తినిధులైన♦గాలినిజంబుఁ
దిట్టునంతటిమారు♦తిక్కకుఁదగిన
వట్టిశీలతసంపు♦వదనంబున్నహా
లతకాల్పకుండన♦లఘుకార్యకరణ
కృతనిశ్చితాంతవం♦కేకానవంబు
తాలిచనదియేలగ♦తామాహాతాప
కీలావగీశాంతి♦నిశీతనలిల

మిళితచందనపంక ♦ మృగమదసార
కలితాంగివైభోగి ♦ కాంతాళిబెగడ
సువిలాసమున నెంత ♦ సోలకుండగను
భువిదివియొండైన ♦ పూన్కిపోవిడని
నడకతీరదియేల! ♦ నాటియాంతరము
వశినెఱుంగఁగనేరి ♦ వశముకాదయ్యా!
హరిహరబ్రహ్మాదు ♦ లగుదేవతలకై
దరముగాకుండెడు ♦ తరిజడంబగుచు
బఱఁగునాకలమెట్లు ♦ భామాంతరంగ
చరితంబెరుఁగుధన్య ♦ శాలియానయ్యా!
కానియాబాలతాఁ ♦ గడు పూన్కిమీఁద
పైనేగుచోఁజేతఁ ♦ బట్టిగొంపోవు
నవియేమి?చూడఁగ ♦ నగ్గిపుల్లలను
రవులుచు పెట్టెకి ♦ రసనీలబుగ్గి
వలెఁదోచె వీనితో ♦ వనితకేపనియొ?

ఆ — నేమి! వెలినుండి ♦ యటుపెందుకో అకు
పోయుచూ చెదమేమి ♦ పోయెనో యచట
ఇది యేమి! మేడపై ♦ నీ వెలుంగేమి!
హృదయభీకరముగా ♦ నేపాగుచుండె
‹ లెండింటివారంత ♦ లెండు పైషేడఁ
జండ తేజమదేమొ! ♦ చనిచూడు" డనుచు
పరిక్కదేవళములో, బ్రాహ్మణుండొకఁడు
పిక్కబిగ్వనవచ్చి ♦ పేరెలుంగునను
నిదురించు వారల ♦ నెత్తివిడి లేపి
‹ పద, మాచు నా మేడ ♦ పైకిఁ గొంపోవ
కఱగఁదు నేత్రంపు ♦ కాంతి చెంగటను
వరలెడు శశికళా ♦ వైఖరి మీఱి
మహిషరాక్షసరక్త ♦ మయఖడ్గశోణ
మహిత తేజమునదు ♦ మ్మనుగాళి మీఱి
తేజరిల్లు మయూఖ ♦ దీప్తికనదుమ

రాజిల్లుకమలాప్తు ♦ రమణినిమీఱి
వరనిష్ఠఁదనతపో ♦ వహ్నులనడుమ
నురుకాంతి నొప్పెడి ♦ యోగినిమీఱి
ఘనసర్వముఖవిషా ♦ క్రాంతకాంతులను
మినికెడితలతాయి ♦ మెఱుపునుమీఱి
యొడలంత పెనుమంట ♦ లుబికి పైకెగయ
నడమీఁక వేడిమి ♦ యొల్లెడఁ గ్రమ్మ
సాహసంబున నిల్చి ♦ చలియింపకున్న
స్నేహలతనుగాంచి ♦ చెదరగుండియలు
కాళ్లనో రాదక ♦ కనులు మూఁతవడ
కల్లోలమునఁ గొంత ♦ కాలమ్ముండి
మనము తెల్విఁబడంగ ♦ మగువతీ కరిఁగి
కనువార లెల్లరొ ♦ క్కటచెంత కుటిల
కాలిపోయినచీర ♦ కడువడిలాగి
తూలికూలెడిబిడ్డఁ ♦ దొడలపైనుంచి

నిలువజాలక దేహ • నిలయంబు వాసె,
తరువాతనింటిలోఁ • దండ్రికి లేఖ
దొరకొనందలివాక్య • ధోరణి వల్కె—
"నాయనా! యిల్లమ్మి • నా పెండ్లి మీరు
సేయనెంచుట యెంత • చింతాకరంబు
కానియింతటి కష్ట • కార్యభారంబుఁ
బూను నవశ్యంబు • పోవు రేఁపటికి
నీపాదు పెండ్లికై • యిల్లు మీరమ్మ
మావు రేపు నిల్వ • మఱిచోటు లేక
గారియల్ పడుచుండఁ • గాంచినే నట్టు
లోరువఁగలనయ్య! • యుల్లంబులోన
మీకష్టములు మాన్ప • మేలొందు లేమి
నీకార్యమును బూని • యొంది చేసితిని
పలువురా పండితుల్ • వరదేశములను
గలుగు వంతలమాన్పఁ • గడునెంతురిగాని

కాంతలురోదనా♦క్రందనం బెగుడ
స్వాంతంబులెఱుఁగక♦సాహసంబుడుగ
నోరులఁదెఱచిక♦న్నులఁదేల వైచి
పూరుషుల్ మూర్ఛల♦పోల్కి చూచుచును
గొంత సేఁపటిదాఁక♦కొయ్యలట్లుండి
చింతింప మనసులు♦చేరంగ మగుడి
కాలయాపనమునఁ♦గార్యంబు లేమి
బాలచుట్టునుదీన♦భంగి రోదించు
సతివలఁదొలఁగించి♦యాలోనమూర్ఛ
మతి లేక పడియున్న♦మగువ నెత్తికొని
వైద్యశాలకుఁ బోయి♦వడి వైద్యు చేత
నుద్యదౌషధముల♦నువిదకిప్పింప
గుణ మొకింతయు లేదు♦కోమలి తెలిసి
“ఘనయత్నములుసన్న♦గావ లేవనుచుఁ”
బలికి పెనమ్రంటల బాధలనంది

తమభూమిన న్యాయధర్మముల్ దెగడి
తమవారి బాధలు దయమాన్పరారె?
పరమాత్ము కరుణాప్రభావంబుచేత
నరసి యీదివసమే నంటించుచున్న
యగ్ని రాజిల్లి దురాచారములను
భగ్నంబుగావింపఁ బ్రజలమనసుల
చెలఁగు నజ్ఞానంపుఁ జీఁకఁటిఁ ద్రోలి
యిలసుఖంబుగఁ జేసి యేపారుగాక!"



